[illegible]

| | | Frequency | Fare |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 2,000 |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 500 |
| 3 | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 400 |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | 1,900 |

Fare includes complimentary Dormitary accommodation and transport/ Guide charges. Tariff for Tour No.4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా “హోటల్ సదరన్”లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్‌లోని అమరావతి/సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిసెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

**Southern Travels/Hotel Southern**

**(Recognised by Department of Tourism, Govt. of India, New Delhi)**

**ఢిల్లీలోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ**

**18/2, Arya Samaj Road, WEA Karolbagh,**
**New Delhi - 110 005.**
**(Phones : 5722210 (6 Lines), 5739508, 5782932)**

Our branches

1 Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004 (Phones 223658, 227233)
2 Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones 2267040, 2262633)
3 Hotel Howrah Complex, Opp Madras Central Railway Station, Madras - 600 003 (Phones 564864, 585253)
4 No 10, Swarnalok Complex, Opp Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones 62227, 66624)
5 Pavan Palace, Ground Floor, Opp T S R Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016 (Phone 545565, 541099)

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి
అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి
ప్రధాన కార్యదర్శి

V.P.-A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కావర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌ల్లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫొటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. ; ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



**స్థాపితము**

**1969**



**సంపుటి**

**28**



**సంచిక**

**9**



**మే - 1997**



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

'వాసవీ భవన్"

యనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ : 24911, 25025.


సంపాదకీయం

# సాంస్కృతిక పారతంత్ర్య ప్రభావము

"సాంస్కృతిక పారతంత్ర్యమ్ము సైపరాని
కీడునిడు, జాతికిది, రాజకీయమైన
బానిసము కంటె చెడుగగు, దీనిద్రోయ
నడుము గట్టిన యతి దయానంద సుకృతి"

- తెనుగులెంక శ్రీ తుమ్మల సీతారామ మూర్తిగారు తమ "ఎక్కట్లు"లో వ్రాసిన పద్యమిది.

సంస్కృతి పరమైన పారతంత్ర్యము అంటే పరాధీనత లేక ఒకరికి లోబడి ఉండుట అనేది ఏ జాతికైనా సహించరానంతటి కీడును కలిగిస్తుంది. అంతేకాదు ఆ విధమగు సాంస్కృతికమైన పారతంత్ర్యము రాజకీయ బానిసతనాని కంటే చెడును చేస్తుంది. అందుకే జాతిని సంస్కృతిపరమైన బానిసత్వము నుండీ దూరము చేసేందుకు దయానంద యతి నడుమును బిగించాడు" - అనేది పై పద్యములోని భావము.

పై భావాన్ని సర్వ వైశ్యులు, సర్వ వైశ్య సంఘాలు సర్వ జాగ్రత్తలతో ఎప్పుడూ ఆలోచించడము అవసరము.

ఎందుకంటే, ఈనాటి వైశ్యులు చదువు విషయము లోను, సంస్కృతి విషయములోను తగినంత శ్రద్ధ చూపించనందున,

ఉపమానాలంకారానికి కాళిదాసు పేరైతే, అర్థ గౌరవానికి భారవి, పద లాలిత్యానికి దండి పేరు. వీరిలోని మూడు గుణాలను మేళవించు కొన్నవాడు మాఘుడు.

తొలి తెలుగు నిఘంటువు ఆంధ్రదీపిక- దాన్ని వ్రాసినవారు మామిడి వెంకటార్యులు.

తొలి తెలుగు లక్షణ గ్రంథము కవి జనాశ్రయము - దాన్ని వ్రాసిన వారు రేచన.

తొలి తెలుగు నవల శ్రీ రంగరాజ చరిత్రము. దాన్ని వ్రాసిన వారు నరహరి గోపాల కృష్ణమ శ్రేష్ఠి.

వేదాలలోని రహస్యాలను సర్వ మానవులకూ అర్థమయ్యే రీతిగా ప్రసంగాలు చేసి, వేద వృక్షాన్ని బందరులో స్థాపించిన వారు - ఆత్మూరి లక్ష్మీ నృసింహ సోమయాజి.

"మధుర కవి" అను నానుడికి శ్రీకారం చుట్టిన వారు - నాళం కృష్ణారావు.

ఆంధ్రశాతవాహన సామ్రాజ్యానికి అన్నింటా ఆధార భూతుడు - చారుగుప్తులు.

గాసట బీసటగానున్న హిందీ భాషను సంస్కరించి ప్రపంచ భాషల్లో హిందీ భాషకు ఉన్నత స్థానాన్ని కల్పించిన వారు మైథిలీ శరణ్ గుప్త , శరశ్చంద్ర ప్రసాద్ గారలు.

భారత జాతి దాస్య శృంఖలాలను ఛేదించిన జాతి పిత మహాత్మా గాంధీ.

భాషా రాష్ట్రాల ఆవిర్భావానికి మూల పురుషుడై, ఆంధ్ర రాష్ట్ర స్థాపనకు అసువులను అర్పించినవారు పొట్టి శ్రీరాములు.

ప్రపంచములో మొట్టమొదటి విప్లవ పార్టీ అయిన గదర్ పార్టీలో చేరిన ఒకే ఒక ఆంధ్రుడు దర్శి చెంచయ్యగుప్త.

మన జాతీయ జండాను ధైర్యంగా ఎగురవేసుకొనే స్వాతంత్ర్యాన్ని సర్వభారతీయులకు ప్రసాదించినవారు దేవత శ్రీ రామమూర్తి.

బొంబాయిలో జరిగిన కాంగ్రెసు మహాసభలకు వెళ్లి అందులో పాల్గొన్న తొలి తెలుగు వారు శనగపల్లె రామస్వామిగుప్త - వీరంతా వైశ్యులే.

ఇంత చరిత్రను గడించుకొని, వైశ్యజాతి కీర్తి ప్రతిష్టలను శిఖరాగ్రానికి చేర్చిన త్యాగధనులు, శౌర్యవంతులు, సరస్వతీ పుత్రులు ఎందరో ఉన్నా ఈనాటి వైశ్యులు సాంస్కృతికమైన బానిసత్వాన్ని భరిస్తున్నందు వల్లనే వారిని గుర్తించలేక పోతున్నారు. తమ జాతి గత చరిత్రా వైభవాన్ని తిలకించలేక పోతున్నారు.

గ్రంథి వెంకట సుబ్బరాయ శర్మగారు శ్రమ తీసుకొని వ్రాయక పోతే ఈనాడు లభించే ఎన్నో వైశ్య మహనీయుల చరిత్రలు ఈ తరం వారికి అందేవి కావు. అయినా ఆయన జీవిత చరమ దశలో దుర్భర దారిద్ర్యముతో అలమటించి ఆకలి దప్పులతో మహా పట్టణమైన గుంటూరులో మరణించారు.

అవధాన చరిత్రలో ధ్రువతారగా నిలిచి తిక్కనగారు వ్రాసినన్ని పద్యాలను వ్రాసిన శతావధాని దోమా వెంకట స్వామి గుప్తగారు అంతిమదశలో ఆకలి దప్పులతో అలమటించారు.

...త్తాలను సేకరించి, సరళమగు తెలుగు బాషలో అందించిన వనమా వెంకట రమణగుప్తగారు కూడా నికృష్టమైన వేదతనాన్నే చవిచూశారు.

ఇదంతా ఎందుకు జరిగిందంటే? ఈనాటి వైశ్యులను ఆవరించిన భాషాపరమైన, సంస్కృతి పరమైన బానిసత్వము వల్లనే

కందుకూరి వీరేశలింగంగారు తలపెట్టిన విధవా పునర్వివాహానికి మూలస్తంభంగా నిలిచిన వారు ఆత్మూరి లక్ష్మీ నృసింహ సోమయాజి గారు "మా సోమయాజి సహాయం లేకుంటే నేను ఈ పునర్వివాహాన్ని చేయగలిగేవాణ్ణి కాదు" అని కందుకూరి వీరేశలింగం గారు తమ స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నారు కూడ. ఈ విషయం ఈనాటి వైశ్యులకు ఎందరికి తెలుసు?

దీనికి కారణమేమి?

సాంస్కృతిక పారతంత్ర్యమే కదా!

తమ కుమారునిచే శిఖాయజ్ఞోపవీతాలను ధరింప జేశాడని బ్రాహ్మణ్యము ఒకనాడు మామిడి వెంకటార్యులపై దాడిచేస్తే ఆయన పాలకొల్లును వదలి వచ్చి బందరులో తలదాచుకోవలసి వచ్చింది. ఇందుకు కూడ కారణము సాంస్కృతికమైన స్వాతంత్ర్యము లేక పోవుటే. సంస్కృతి విషయములో తగినంత శ్రద్ధ వైశ్యులు తీసుకోనందుననే తమను గోత్రభ్రష్టులుగా, యోనిభ్రష్టులుగా, వైదిక కర్మలకు అర్హులు కానివారుగా చిత్రిస్తూ పుస్తకాలు వ్రాస్తే వాటిని తమ ధనంతో అచ్చు వేయించడమే కాక ఆయా గ్రంథకర్తలకు ఘన సన్మానం చేసి డబ్బిచ్చి తిట్టించుకొన్న వారయ్యారు.

కావున ఈనాటి వైశ్యులు ఆలోచించ వలసింది కేవలము రాజకీయ స్వాతంత్ర్యాన్ని గురించి మాత్రమే కాదు. అంతకన్న ముఖ్యము, అంతకన్న చెడును చేసేది., రాజకీయమైన స్వాతంత్ర్యాన్ని సాధించుటకు ముఖ్యమైనది అయిన సాంస్కృతిక పారతంత్ర్యాన్ని పోగొట్టు కొనుటను గుతించే.

చదివేందుకు మాకు సమయం ఎక్కడ ఉంది? అనేవారూ, ప్రపంచముతో మాకేమి పని? మా వ్యాపారము మాకు చాలు అనే వైశ్యులు సాంస్కృతిక పారతంత్ర్యము వలన కలిగే చెడుగును తప్పక బేరీజువేసుకోవాలి.

సర్వవైశ్య సంఘాలు, వైశ్య నాయకులు తమ జాతికిసాంస్కృతిక పారతంత్ర్యాన్ని పోగొట్టుటకు తీవ్ర చర్యలు తీసుకోవాలి. తాము ఆశిస్తున్న రాజకీయ స్వాతంత్ర్యము సిద్ధించుటకు ఈ ప్రయత్నము ఎంతో సహాయకారి కాగలదు

వైశ్యప్రబోధిని, మే 1997

# శ్రీ వాసవి కన్యకా పురాణం

మూలం : వ్యా స్కాంధ పురాణం

శ్లోకానువాదం : శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి (సంపాదకులు)

## మొదటి అధ్యాయము

మహా పుణ్యక్షేత్రము నైమిశారణ్యము. ఆ క్షేత్రము మహర్షి సంఘములు చేయు వేద నాదములతో నిండినది. కానుగ, మామిడి, పొన్న, బొట్టుగ, అశోక, సంపెంగ, రావి, వెలగ, జువ్వి, ఇప్ప మొదలగు వృక్ష రాజములతో ఆ ఆశ్రమము అలరారు చుండును. ఆ వృక్షములు అన్ని ఋతువులందునూ పుష్పించునవి. అన్ని ఋతువులందు నూ ఫలించునవి. ఆ అరణ్యమున 'గోమతి' అను గొప్ప నది ఉండెను. ఆ నది ఒడ్డున ఒక గొప్ప ఆశ్రమము కలదు.

వసిష్ఠుడు, గాలవుడు, వ్యాసుడు, శుక్రుడు, శక్తి, పరాశరుడు, అధిక తేజస్వి యైన శరభంగుడు, గొప్ప తపస్సంపన్నుడగు మందపాలుడు, జాబాలి, కశ్యపుడు, అగస్త్యుడు, గార్గ్యుడు, మాండవ్యుడు, శౌనకుడు, విశ్వామిత్రుడు, బభ్రువు, తేజోనిధియైన మైత్రేయుడు, అధికమైన జ్ఞానము గల శ్వేతకేతువు, సుతీక్ష్ణుడు, కుత్సువు, వత్సకుడు, తిత్తిరి, వరతంతువు, కపిలుడు, చ్యవనుడు, భృగువు, ఆప స్తంబుడు, అత్రి, కుద్దాలుడు, జమదగ్ని, కణాదుడు, గౌతముడు, శతానందుడు, మొదలగు బ్రహ్మ విదులైన మహర్షులు గుంపు కూడి, ఒక చేయుచుండిరి. ఆ మహర్షులందరూ వేద, వేదాంగ విధులు. బ్రహ్మ స్వరూపమును తెలిసిన వారు. శ్రేష్ఠులు. లోకాలను రక్షించగల శక్తిగలవారలు. కృపతో కూడినవారు. మహాత్ములు.

ఆ మహర్షి సంఘములో 'సూతుడు' అను మహర్షియూ ఉండెను. ఆ సూత మహర్షి పురాణములు చెప్పుటలో శ్రేష్ఠమైనవాడు - సకల వేదముల యొక్కయు, ఉపనిషత్తుల యొక్కయు శాస్త్రముల యొక్కయు, అష్టాదశ పురాణముల యొక్కయు, ముఖ్య రహస్యములను తెలిపిన వాడు. మంత్రము లకు వ్యాఖ్యానము చెప్పుటలో చాలా గొప్పవాడు. శరీరము నిండా విభూతిని పూసుకొని, జటా కిరీటముతో ప్రకాశించు వాడు. మొలకు చిత్రమైన పులి చర్మమును కట్టుకొని, జింక చర్మమును కప్పుకొని యుండువాడు. చూచుటకు శక్యము కాని కాంతితో, ఈయనే మహేశ్వరుడా! అను రీతిలో నుండువాడు. నారచీరలు, జింక చర్మములను ధరించి, ఇంద్రియ నిగ్రహము కలిగి, యాగదీక్షను పొందినట్టి ఆ మహర్షులు ఆ సూతుని చూచి, అతని యొద్దకు వెళ్ళి, సంతోషముతో పిలుచుకొని వచ్చి, దర్భ పీఠముపైన కూర్చుండ : అర్ఘ్యము, పాద్యము ఇచ్చి అతిథి పూజ చేసిరి. ఆ తరువాత వారంతా ఆయన

సమీపమున కూర్చొని, ఆ శౌనకుడు మొదలగు మహర్షులు ఆయనచే పుణ్య కథలను వినవలయును అనుకొని,

ఓ సూత మహర్షీ! మీరు వ్యాసుని శిష్యులరు. మహానుభావులరు.. పావనములూ, చెవికి ఇంపును కూర్చునట్టి ప్రాచీనములూ అయిన పదునెన్మిది పురాణాలనూ మునుపు మీరు చెప్పి యున్నారు. వైష్ణవము, బ్రహ్మకైవర్తము, బ్రాహ్మము, భాగవతము, లైంగము, శైవము, నారదీయము, బ్రహ్మాండము, పాద్మము, మార్కండేయము, ఆగ్నేయము, వారాహము, వామనము, గారుఢము, మాత్స్యము, కౌర్మము (కూర్మము), స్కాంధము, వాయవ్యము - అని పదు నెన్మిదిగా గల ఆ పురాణాలలో స్కాంధ పురాణము అతి విచిత్రములైన కథలచే ప్రశస్తమైనది. ఆ స్కాంధ పురాణములోని ఉత్తర భాగములో బ్రాహ్మణ విహితములైన ధర్మములనూ, ఆశ్రమములకు చెప్పబడిన సనాతన ధర్మములనూ మీరు చెప్పగా వింటిమి. పాపములను పోగొట్టు ఆత్మవిదులైన మహర్షుల యొక్కయూ, మహాత్ములైన రాజర్షుల యొక్కయూ - కథలునూ మీరు చెప్పితిరి.

ఇపుడు, భవహరమూ, అనంత పుణ్యప్రదమూ, ముక్తి సాధనమూ అగు శ్రీ వాసవీ దేవి చరిత్రమును వినవలయునని కుతూహల పడుచున్నాము. ఓ పాపరహితా! పూర్వము తనకు గల పదు నాలుగు నామములలో 'కన్యక' అను నామమునూ ఒకటిగా గల ఆ ఆదిశక్తి. ఆ పరాంబ, ఆ జగదంబ ఎందు కొఱకు? ఏ అవతార ధ్యేయముతో కలి యుగమున వాసవిగా జన్మించినది. ఆ యమ్మ అవతార సమాప్తి యెట్లు జరిగినది. సవిస్తరంగా ఇపుడు మాకు చెప్పండి. ఈ విషయమును చెప్పుటకు నీ ఒక్కడివే అర్హుడవు. అని ప్రార్థించిరి.

ఈ విధముగా వారలు అడుగగా, పురాణజ్ఞులలో శ్రేష్ఠుడైన ఆ సూత మహర్షి "ఓ మునులారా! వినుడు. మీరు అన్నీ తెలిసిన వారిలో గొప్పవారు. అయినా, నా పై మీలో గల వాత్సల్యమున నన్ను గొప్ప జేసి అడిగితిరి. నా బుద్ధికి తోచినంత వఱకూ, ఆ వృత్తాంతమును విస్తరించి, మీకు వివరింతును. మహాత్ములైన మీకు నమస్కారము. చిత్స్వరూపిణి యైన శ్రీ కన్యకా దేవికి నా నమస్కారములు. నిర్మలమైన జ్ఞానమనే సముద్రుడునూ, మహాత్ముడునూ, పరాశరుడు అను మహర్షికి నందనుడునూ, నారాయణ స్వరూపుడునూ, అయిన వ్యాసదేవునికి నమస్సులు. నమస్సులు. సరస్వతీ దేవికి నమస్కారము. నిత్యుడైన గణపతికి నమస్కారము. సకల భూతములలో అంతర్యామిగా ఉన్న శివునికీ, విష్ణువుకూ, బ్రహ్మకూ నమస్కారము." అని అతి నిర్మలములైన వాక్కులచేత, దేవతలనూ, బ్రహ్మవేత్తలగు మహర్షులచే ఒప్పుచున్న సభనూ, వినయముతో శిరసు వంచి, పూజించి, తేనెవలె రుచికరములగు మధుర వచనములతో శ్రీ వాసవీ దేవి చరిత్రము ను చెప్పుటకు ప్రారంభించెను.

ఇది స్కాంధ పురాణము మందలి- ఉత్తర ఖండమున గల సనత్సుజాత

సంహిత యందు - వాసవీ దేవి చరిత్రమును గూర్చి శౌనకాది మహర్షులు సూతుని ప్రశ్నించిన మొదటి అధ్యాయము

## రెండవ అధ్యాయము

సూత మహర్షి చెప్పినవిధము:

"మహర్షులారా! చిత్తమును సమాయత్తము చేసికొని, భక్తితో వినండి. సాలంకాయనుడు అను ఒక ఋషి గలడు.ఆ ఋషిప్రాచీనుడు. తపోనిధి. వేదములూ, వేదాంగములూ సొంతముగా తెలిసినవాడు. ఆత్మనిష్ఠుడు. క్రోధమును జయించినవాడు. బ్రహ్మసమానుడు. అంతరింద్రియ నిగ్రహము కలిగినవాడు. ఆయన గోదావరీ తటమున అనేక మంది శిష్యులను కలిగి ఆ శిష్యులచే వేదములనూ, శాస్త్రములనూ, ఇతిహాసములనూ పఠింప చేయుచూ, దేవతలనూ, పితృదేవతలనూ నిత్య తర్పణములచే తృప్తి పొందించుచూ, ఒక ఆశ్రమమున నివాసము చేయుచుండెను. ఆ గోదావరీ తటము పండ్లతో కూడిన వృక్షములతోనూ, కదలు చుండెడి కలువ పూలలోని తేనెను త్రాగి మధించిన పక్షుల గుంపులతోనూ కూడినట్టిది. ఆ సాలంకాయనుని ఆ ఆశ్రమము వికసించిన కమలముల సమూహము నందుండి, ఎగురుచున్న తుమ్మెదల గుంపు అను చీకటితో కూడిన మల్లెపూల పొదరిండ్ల యొక్క మధ్య భాగములు కలిగినది. బహుళ ప్రవాహములలో క్రీడించు చుండెడి రాజహంస దంపతులు చేసే హెచ్చైన కలరవములతో ధ్వనించుచున్న దిక్కులు గలది. బంగారు వంటి కాంతి కలిగినది. బ్రహ్మర్షి సమూహములు మంత్రములతో పిలువగా తమ హవిర్భాగములను తీసుకొనుటకై వేగముగా వచ్చిన దేవతలతో నిండుకొన్నది. వేద ధ్వనితో కూడినది. ఋగ్వేదము,యజుర్వేదము, బృహతి అను సామవేదమును గానము చేయుచుండు కోకిలలచే ఒప్పుచుండునది. బ్రహ్మ సూత్రములను గూర్చి ఉపన్యసించుచున్న చిలుకలతో కూడినది. ప్రాతఃకాలము, సాయంకాలములలో చేయు హోమములలో వ్రేల్చగా ఏర్పడిన నేతి సంబంధమైన ధూమము, వాసనలలో నిండుకొన్నది. మెట్ట తామర పుష్పాది రాసులతో పచ్చగా ఉండునది. అట్టి కాలములో మణిగుప్తులు మొదలగు వైశ్య ముఖ్యులు ఆ సాలంకాయన మహర్షిని చూచుటకై పరమ శుభకరమగు ఆ సాలంకాయన మహర్షి ఆశ్రమమునకు వచ్చిరి. మణిగుప్తాదులగు ఆ వైశ్య ముఖ్యులు మహానుభావులు. సత్యమును మాత్రమే పలుకు వారలు. తపస్సంపన్నులు, వేదములను పఠించినవారలు. క్రోధమును జయించిన వారలు. ఇంద్రియ నిగ్రహము కలవారలు. నార వస్త్రములను ధరించిన వారలు. జటా మకుటములతో ప్రకాశించువారలు, వాయువునూ, ఆకులనూ ఆహారముగా తీసుకొనువారలు, బ్రహ్మయొక్క కుడి తొడనుండీ పుట్టిన వారలు".

సాలంకాయన మహర్షి వచ్చిన ఆ మణిగుప్తాదులను చూచి, ఉత్సాహముతో వారలకు పాదములను కడుగు కొనుటకు నీటిని ఇచ్చి, అర్ఘ్యమును ఒసగెను. ఋషి

యోగ్యములగు దర్భ పీఠములు జూపి కూర్చుండజేసి, తియ్యని మాటలతో " ఓ మహాత్ములారా ! తమకు శుభమే కదా? మా అదృష్ట వశమున, చాలా కాలానికి, మా పూర్వజన్మకృత సుకృతమున మీరలు నా ఆశ్రమమునకు వచ్చితిరి. మీరు ఎక్కడికి వెళ్ళుచూ, ఇక్కడికి వచ్చితిరి? 'వైశ్యోత్తము లారా! మీరు వచ్చుటచే నాకు మిక్కిలి సంతోషము - కలిగినది." - అని అడిగెను. అమృతము వంటి రుచిగల, ఆ మహర్షి వాక్కులను విని, విరూపాక్షుని పుత్రుడగు మణిగుప్తుడు మొదలగు వైశ్య ఋషు లందరూ మిక్కిలి సంతోషపడి ఆ ముని పుంగవునితో ఇట్లని బదులు పలికిరి.

ఓ మునిశ్రేష్టా! ఇప్పుడు మేము కృతార్థులమైనాము. ఎన్నో జన్మలలో చేసిన తపస్సు చేత నీ పాదకమలముల సేవ లభించింది. పాపమును పోగొట్టు నట్టివియు, సుకృతములను ఇచ్చు నట్టివియు, జననాది రోగములకు ఔషధము వంటివియు అగునట్టి ఈ మీ పాద కమలములను జూచి నందున మాపాపములు నశించినవి. మా హృదయములు పరిశుద్ధములైనవి. మీ వంటి వారు మహాత్ములు. ఆత్మవిదులు. అట్టి మీ దర్శనమును చేసుకొన్న మాకు లభించనిది. ఏమి ఉండును.? చింతామణి చేతిలోనూ, కల్పవృక్షము దగ్గరలోనూ ఉండగా లభ్యము కాని వస్తువు ందునా?" వారిలో పలుకుటకు నేర్పుగల కొందఱు వైశ్య ఋషులు ఓ మునివర్యా! వినుడు. అని తమ వృత్తాంతమును ఇట్లు చెప్పిరి. ""పుణ్య తీర్థములను సేవించ వలెనని మేము బ్రహ్మ కుండము నుండీ బయలు దేరి, హిమవత్పర్వతము, హేమ కూటము, పారియాత్రము, మేరువు, వింధ్య పర్వతము, సహ్యగిరి, క్రౌంచము, వేంకటాద్రి, గంధ మాధనము మొదలగు పర్వతములను సేవించితిమి. దివ్యమైన పరిమళముతో, మనోహరముగనూ, ఆకాశము వరకు వ్యాపించి ఉండు వృక్షములతోనూ కూడిన ఆ పర్వతములు మాకు ఆనందాన్ని కలిగించినవి.

సిద్ధులూ, గంధర్వులూ సేవించుచున్న ఆ పర్వతములను సేవించిన మేము ముల్లోకములనూ పావనము చేయు గంగ, యమున, సరస్వతి, రేవ, చర్మణ్వతి, సింధు, చంద్రభాగ, శరావతి, గోమతి, నర్మద, కృష్ణ, కావేరి, పాపఘ్ని, తామ్రపర్ణి, బాహుద, పినాకిని మొదలగు పుణ్య నదులందునూ, సముద్రములందునూ స్నానము చేసి, గోదావరీ పుణ్య నదిలో గ్రుంకులిడుటకై ఇచ్చటికి వచ్చితిమి. ఓ మునిశ్రేష్టా! మా భాగ్యము వల్ల ఇప్పుడు జన్మ రాహిత్య కారణమైన మీ పాదకమలములను కనుగొంటిమి. నీవు నిరంతర శుభ ప్రదుడవగుటచే, ఇంక గంగాది సర్వ తీర్థములనూ సేవించిన ఫల మనవసరము అని, ఇట్లు పలికి, ఆ వైశ్య శ్రేష్ఠులు పులకాంచిత దేహులై, ఆనంద భాష్పముల చేత తడిసిన కపోలములు గలవారై, ఉత్సాహముతో కూడిన మనస్సు గలవారలై, "మీ దర్శనము వల్ల నిపుడు లోకమందు మేము కృతార్థులమైతిమి.ఇపుడు మాకు పుణ్యప్రదమైన ఒక కథను వినుటకు అధిక ప్రీతి కలిగినది. " "ఆదిశక్తి శ్రీ కన్యకా

పరమేశ్వరీ ఏ ధ్యేయముతో కలియుగమున 'వాసవి'గా జన్మించినది". ఆ విషయమును విస్తరించి చెప్పుటకు నీవు అర్హుడవు అని వారు ఆ మునిని ప్రార్థించిరి.

ఇట్లు ఆ వైశ్య మునులు అడుగగా సాలంకాయన మునీంద్రుడు "వైశ్యులారా! మీ వినయమునకు మిక్కిలి సంతోషించితిని. మీరు అడిగిన ఆ వాసవీ అవతార కథనము విను వారల యొక్క దోషములను పోగొట్టునది. మహా యోగ్యమైనది. సకల సంపదలనూ ఇచ్చునది. సర్వ సౌభాగ్యములనూ ఇచ్చునది. కుటుంబ వృద్ధిని కలుగ చేయునది. గృహ సమృద్ధినీ, దార, పుత్రాదుల అభివృద్ధినీ కలిగించునది. పుత్రులు కావాలను కోరికతో విను వారికి పుత్రులను ఇచ్చునది. ధనాపేక్షతో విను వారికి ధనమును ఒసగునది. సుఖమును కోరి విను వారికి సౌఖ్యమును ఇచ్చును. శాశ్వత కీర్తిని ఆకాంక్షించి, విను వారికి కీర్తిని ప్రసాదించును. శుభప్రదమైనది. మీరు అడుగగా ఈ చరిత్రమును చెప్పుచున్నాను. ఈ పుణ్య చరిత్రమును ఎవడు భక్తితో వినునో ఆ చింతామణి అతని చేతిలో ఉండినట్లు. కల్ప వృక్షము అతని ఇంట నుండినట్లు. కామధేవును అతని గోశాలలో నివసించునట్లు.

పూర్వము కృతయుగము నందు శుంభ, నిశుంభు లనెడి రాక్షసులను, గర్వముతో దేవతా స్త్రీలను చెఱ పట్టిన మహిషాసురుని, ఏ దేవి సంహరించినదో, త్రేతాయుగము నందు భుజబల గర్వితలే ధర్మములను నాశనము చేసిన దుష్ట రాజ సమూహమును వధించిన పరశురామునికి ఏ దేవి తల్లియైనదో, లోకేశుడైన కృష్ణునకు జన్మసోదరిగా యశోదా గర్భమున జన్మించి, కంసుడు మొదలగు రాజులను సంహరింప చేసి 'శ్రీ' నామముతో ద్వాపర యుగములో ప్రకాశించినదో - ఆ దేవి - ఇక మీద కుసుమ శ్రేష్ఠి అను పేరు గల వైశ్యోత్తముని గృహమందు 'వాసవి' అను నామముచే పవిత్ర గోదావరీ తీరమున జన్మించును. ఆ దేవి - అంతవరకు తన అవతారములలో గల హింసా ప్రక్రియకు స్వస్తి పలికి హింసకు తావు లేని సరిక్రొత్త రక్త రహిత శాంతి సత్యాగ్రహము ద్వారా కలియుగమున వర్ణాశ్రమాచార ధర్మములకు భంగము కలిగించ ప్రయత్నించు విష్ణువర్ధనుడు అను రాజును శిక్షిస్తుంది. అంధకార బంధురమైన జగత్తులో అహింసా జ్యోతిని వెలిగిస్తుంది. 'రక్తరహిత శాంతి సత్యాగ్రహము' అను పేరుగల సరిక్రొత్త మార్గాన్ని జగత్తుకు ప్రసాదిస్తుంది. కాల ప్రభావం వలన సంభవించే పరదేశ ప్రభువుల దాస్యం నుండి ఈ భరత భూమిని రక్షించేందుకు ఆ 'శాంతి సత్యాగ్రహము' అనునదే పరమ సాధన మౌతుంది. మీ వంశమున బుట్టిన ఒకరు - ఈ శాంతి - సత్యాగ్రహాన్ని చేపట్టి మాతృదేశ దాస్య విదళనం చేస్తారు. కలియుగ పాపములను పోగొట్టునట్టి ఆ వాసవీ కన్యక కథను మీ శ్రేయస్సు కొఱకు ప్రీతితో చెప్పుచున్నాను. పవిత్రమైన ఈ కథను సమాహిత చిత్తముతో, అధిక భక్తితో వినుడు".

ఇది స్కాంధ పురాణమందు - సనత్సు జాతీయ సంహిత గల ఉత్తర ఖండము -

వైశ్య ఋషులు సాలకాయన మునిని అడిగిన వాసవీ చరిత్రోదంతములో రెండవ అధ్యాయము.

## మూడవ అధ్యాయము

సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పిన శ్రీ వాసవీ దేవి దివ్య చరిత్రను సాలంకాయనుడు వైశ్యమునులు చెప్పుచున్నాడు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల లోకాలైన సత్య లోకము, వైకుంఠము, కైలాసాలకు కొంత దూరాన మణి ద్వీపమున్నది. ఈ మణి ద్వీపము అత్యంత శోభావహమైనది. మహా వైభము గలది. ఈ ద్వీప శృంగారాన్నీ, విభవాన్నీ వర్ణించుటకు సహస్రాగములకు కూడ అసాధ్యమే. సురముని జనములతో సేవింపబడునది. గొప్ప మహిమను కలది. ఆనందమును కలిగించునది. అత్యంత ప్రమోదకర మైనది. ఈ మణి ద్వీపమే ఆదిశక్తికి ఆవాసము. సృష్టి, స్థితి, లయములకు మూలభూతమైన ఆ ఆదిశక్తి కరుణా రసమూర్తి. కామితార్థ ప్రదాయిని. సర్వకాల సర్వావస్థల యందునూ ఈ చరాచర జగత్తు యావత్తునూ పరిపాలిస్తూ ఉంటుంది. తన సృష్టి స్థితి, లయాలు అను కార్యక్రమాలను పర్యవేక్షిస్తూ ఉంటుంది.

ఈ మణిద్వీపములో - అనంత - ప్రభా భాసమాన సభా మందిరములో ఆదిశక్తి కొలువుదీరుతుంది. వాణీవిభుడు బ్రహ్మాక్షరముల తోనూ, శారదా దేవి వీణా గానానేక కళలతోనూ, లక్ష్మీ నాథుడైన నారాయణుడు అనేకములైన తన లీలా విలాసాలతోనూ, శ్రీ మహాలక్ష్మి అత్యంత హృదయానందకర శృంగార విభవముతోనూ, శివకరుడైన శంకరుడు తన తత్త్వవాక్యధనముతోనూ, గంగ, గౌరీ దేవులు మహోపచారములతోనూ - ఆ ఆదిశక్తిని - ఆ కొల్వులో ఉండి సేవిస్తూ ఉంటారు. ఆశ్రిత జన విపత్పరంపరా నిర్వాహణ దుర్వహా ఖర్వమై, సమస్త బృందారకులతో, వసిష్ఠాది మహా మునులతో, యక్ష, సిద్ధ, గంధర్వ, గరుడ, ఉరగ, ఖేచరాదులతో ఆ పరాంబ కొల్వు అలరారుచూ ఉంటుంది.

ఆ ఆదిశక్తియే పరాంబ. పరాశక్తి. యోగమాయ. సర్వమునకూ అధికారిణి. ఆమెను శాసించుటకు ఆమెపై అధికారము గల వారెవ్వరూ లేరు. ఆ ఆదిశక్తి - అనిరీశ్వరి, నిరీశ్వరి, కన్యక - అని కూడ పిలువబడుచూ ఉంది. ఆ ఆదిశక్తియే కన్యకా పరమేశ్వరీ నామమున - మీకు (వైశ్యులకు) కుల దేవతయై మీతో పూజలందుకొంటూ ఉంది.

ఆ ఆదిశక్తి తన రూప వైభవముతో విభ్రాజమానంగా కన్పించినపుడు సాకార. ఆ రూపాన్ని ఉపసంహరించుకొన్నపుడు నిరాకార. ఆమె ప్రతి రోమ కూపములోనూ అనేక బ్రహ్మాండములుండును. బ్రహ్మ విష్ణువు, మహేశ్వరుడు ఆ పరాంబ సంకల్పముచే ఆవిర్భవించిన వారే. శ్రీ వాణీ గిరిజలు ఆ పరమేశ్వరి సంకల్ప ప్రభావముతో జన్మించిన వారే. ఆదిశక్తి అంశమే మహా విరాట్టు. పరమ దయానిధీ, భవ బంధహరణా అగు ఆయమ్మ విశ్వాసానుగ్రహాల వల్లనే అనేకానేక సందర్భము లనుకూలిస్తున్నవి.

(ఇంకావుంది)

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

(రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)


టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"

టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004

శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030

పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682


## వైశ్య యాత్రికులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము యివ్వబడును. 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

### తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫొటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫొటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రు 5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్థ మహా క్రతువు 27.4.97 నుండి 5.5.97 వరకూ విజయవాడ శ్రీ భావనారాయణ కాలేజీలో జరిపించుచున్నాము.

పై యజ్ఞము జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు - మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన యజ్ఞం, రెండవరోజు రామకృష్ణ యజ్ఞం, మూడవరోజు అష్టలక్ష్మి యజ్ఞం, నాల్గవరోజు శ్రీ లక్ష్మి, వెంకటేశ్వరస్వామి యజ్ఞం, ఐదవ రోజు పుత్రకామేష్టి యజ్ఞం, ఆరవరోజు రుద్రంయజ్ఞం, ఏడవ రోజు సప్తశతి, దుర్గాయజ్ఞం, ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి యజ్ఞం, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ యజ్ఞం, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 12 నుండి 4 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, 4 నుండి 7 వరకు ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-8 వరకు లక్ష దీపాలంకరణలు, 8-10 ఆధ్యాత్మిక ప్రదర్శనలు జరుపబడును. యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, 3-308, మార్కాపురం - 523 316.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 మే 21 నుండీ 1997 జూన్ నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 25 | జూన్ 1 | 8 | 15 | |
| సోమవారము | | 26 | 2 | 9 | 16 | |
| మంగళవారము | | 27 | 3 | 10 | 17 | |
| బుధవారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| గురువారము | 22 | 29 | 5 | 12 | 19 | |
| శుక్రవారము | 23 | 30 | 6 | 13 | 20 | |
| శనివారము | 24 | 31 | 7 | 14 | | |

మే 25 :- బుద్ధ జయంతి. రోహిణీ కార్తె రాక. ఉ. 8.13.

మే 28 వాస్తు కర్తరీ త్యాగం.

మే 31 :- 1996-1997కు సంబంధించి, లాటరీలు, క్రాస్‌వర్డ్ పజిల్సులలో గెలుపొందిన వివరాలను తెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం. 26 B,ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి రోజు.

మే 31 :- 1996-97 ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన గుర్రపు పందెములలో గెలుపొందిన వివరాలను తెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం. 26 B.Bని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

మే 31 :- 1997 ఏప్రెల్‌నెల జీతములో పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు కడపటి రోజు.

మే 31 :- పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 ఏప్రెల్ నెలలో చెల్లించిన జీతము, ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంట్ ఫారము నెంబరు 21ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

మే 31 :- ఆదాయపు పన్ను చట్టము క్రింద శాశ్వత ఖాతా నెంబరు, ఇంతవరకు కేటాయించబడక గడచిన 1996-97 ఆర్థిక సంవత్సరపుఆదాయము కన్న గరిష్టమగు ఆదాయపు పన్ను విధించదగుటకు తగని ఆదాయము కలవారు శాశ్వత ఖాతా నెంబరును పొందుటకు అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి దాఖలు చేయుటకు చివరితేది.

మే 31 :- ఆదాయపు పన్ను చట్టములోని 192వ విభాగము క్రింద జీతములోపట్టుకొన్న వివరాలను తెలుపు 'అన్యువల్ రిటర్ను' అనగా 24 వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తారీఖు.

జూన్ 8 :- మృగశిర కార్తె రాక. ఉ. 7-40.

జూన్ 15 :- చెక్కుద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరురోజు.

జూన్ 15 :- కంపెనీలు 1998 - 1999 అసెస్‌మెంట్ సంవత్సరానికి సంబంధించి చెల్లించవలసిన 'అడ్వాన్సు ట్యాక్సు' మొదటి కంతును చెల్లించుటకు ఆఖరు తారీఖు.

జూన్ 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు, అందుకుసంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**25, 1, 8, 15 ఆదివారాలు**

*- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# వైశ్యులు అనేక నగర రాజ్యాధీశులు

స్వర్గీయ విద్వాన్ అంబటి సుబ్బరాయ గుప్త

*(స్వర్గీయ అంబటి సుబ్బరాయ గుప్త గారు కడపజిల్లా పులివెందుల వారు. గుప్త గారు గొప్ప పండితులు. మంచి చారిత్రక పరిశోధకులు. అనేక అష్టావధానాలు చేశారు. సంస్కృతములో ఉన్న వాసవీ కన్యకాపురాణాన్ని పూర్తిగా చదివి పారాయణమునకు అనుకూలముగా ఉండునట్లుగా దండాన్వయములో వివరంగా తాత్పర్యాన్ని వ్రాశారు. ఈ పురాణాన్ని పెనుగొండ ఆర్యవైశ్య యువజన సంఘము వారు 1957లో ప్రచురించారు. గుప్తగారు తన యీ శ్రీ వాసవీ కన్యకాపురాణములో చారిత్రక ప్రమాణాలతో విపులంగా ఉపోద్ఘాతాన్ని వ్రాశారు. ఆ ఉపోద్ఘాతములోని కొంత ఈ వ్యాసం - సంపాదకులు)*

వైశ్యులు పెనుగొండ వంటి అనేక నగర రాజ్యాధీశులుగా నుండిరని బల్ల గ్రుద్ది చెప్పుటకు కావలసిన శిలాశాసనము లెన్నియో కలవు. క్రీ॥శ॥ 1124వ సంవత్సరపు నాదేళ్ళ శాసనములో బేర్కొనబడిన మొక్కల కామిశెట్టియు, క్రీ॥శ॥ 1144వ సం॥రం నాటి ఘంటశాల జలధరేశ్వర ఆలయమందలి యొక శాసనమందు దెలుపబడిన గొంటా కామిశెట్టియు, గుంటూరు జిల్లా ప్రత్తిపాడులోని క్రీ॥శ॥ 1157 వ సం॥రపు శాసనము వ్రాయించిన నారాయణ శెట్టియు, 1241వ సం॥రపు [illegible]వాడ [illegible] మందలి యొక [illegible]సమున బేర్కొనబడిన గొండూరు పరువఅన్నిసెట్టియు, 13 వ సంవత్సరమున గుంటూరు జిల్లా యనమదల రామస్వామి ఆలయమున శాసనము వేయించిన కొండమల్లు శెట్టియు, 1388 వ సం॥రపు గుంటూరు అగస్తీశ్వర ఆలయమందలి శాసనమున బేర్కొనబడిన గంగిశెట్టియు, 1404 వ సం॥రపు కొండవీటి శాసనముల మూడింట యందుగల చద్విసెట్టివారి శామన్న మున్నగు వారలు పెనుగొండపుర వరాధీశ్వరులని చెప్పబడియున్నారు. 1405 వ సం॥రపు గుంటూరు జిల్లా అప్పాపురం ఆంజనేయ స్వామి ఆలయమందలి యొక శాసనమందు కాటూరి వల్లభసెట్టి అను వైశ్యుడు అయ్యావలి పురాధీశ్వరుడని తెలుపబడినది. 1218వ సం॥రపు గుంటూరు జిల్లా ఉప్పుగుండూరు గౌరీశ్వరాలయ మందలి శాసనం వేయించిన గుద్దలి చండిశెట్టియు, నతని కుమారుడు వైతమసెట్టియు నెల్లూరు ప్రభువులుగా నుండినట్లు చెప్పబడియున్నారు. 1393వ సంవత్సరమున సింహాద్రి శెట్టి, ఒబిలిసెట్టి అను వైశ్యవర్యులు కొరుకొండ రెడ్డి రాజ్యమున తదీయ నృపాలుడు బాలుడుగా నుండిన కాలమందు పరిపాలన చేసిరని మెకంజీదొరగారి 19-107 లోకల్ రికార్డ్సు సంపుటిలో వ్రాయబడి యున్నది.

క్రీ॥శే॥ సామి వెంకటాచలం శ్రేష్ఠిగారు వారి "వైశ్య డైరెక్టరీ" యందు " చరిత్ర కాలవిమర్శ" అను శీర్షిక క్రింద

క్రీ॥శ॥ 1118వ సం॥రం నాటికే గతించిన కులోత్తుంగచోళుడు క్రీ॥శ॥ 1127 నుండి 1158 వరకు రాజమహేంద్రవరమును పాలించెనని అతని ఆయువును 40 సం॥రములు పొడిగించినారు. కులోత్తుంగుని కుమారుడు విక్రమచోళుడై యుండ, కులోత్తుంగుని తండ్రి విక్రమచోళుడు వేంగిరాజ్యము వీడి చోళరాజ్యపాలనకు బూనుకొనెనని ఆంధ్రకవి జీవిత చరిత్ర వలన దెలియుచున్నదని, తండ్రిని కొడుకుగాను, కొడుకును తండ్రిగాను చేసి వ్రాసియున్నారు. ఈ యవక తవక వ్రాతయంతయు శ్రీసామి వెంకటాచలం శ్రేష్ఠిగారు "దక్షిణ ఇండియా రిసర్చి" పత్రిక ప్రధమ సంపుటి ముప్పదవ సంచికలో తత్పత్రికా సంపాదకులైన కీ॥శే॥తేకుమళ్ళ రాజగోపాలరావుగారు రాజమహేంద్రవరం మ్యూజియమందలియొక స్తంభమున తూర్పు చాళుక్యరాజగు సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుని కాల మందలి శాసన మొండు కలదనియు, ఆ శాసనము విష్ణువర్ధనుని పరిపాలనాకాలము 21వ సం॥ రమున శా. శ.1067 (క్రీ.శ 1145) వ సంవత్సరమున బట్టినపునాడులోని వీరభద్రస్వామికి పెనుగొండ మాదిసెట్టి కొడుకు ప్రోలిసెట్టి దీపమునకు గాను 25 అవులను దానము చేసినట్లున్నది. కావున విష్ణువర్ధనుడా కాలమందుండెనని వ్రాసియున్నారు.

ఈ రాజగోపాలరావుగారి వ్రాతనే విమర్శించు శ్రీ. వీరభద్రరావుగారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక యందు ప్రకటించిన "విష్ణువర్ధనుడు-వాసవకన్యక"అను వ్యాసమున రాజరాజనరేంద్రుని మనుమలలో చోడగంగునకు సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుడు అను బిరుదమున్నట్లు దెలియుచున్నది. కాని అతని తండ్రి బ్రతికియున్న కాలమందే అతను వేంగిదేశమునకు ప్రతినిధిగా నుండెను. కాని క్రీ॥శ॥ 1145 వ సంవత్సరమునగాని, అంతకు పూర్వము 21 సంవత్సరముల నుండి కాని, రాజ్యపాలన చేయు చుండినట్లు చెప్ప సాధ్యముకాదని, విక్రమ చోడుని పరిపాలనయే వేనోళ్ళ చాటుచున్నది. ఆ శాసనము నాటికి ఆ విష్ణువర్ధనుడు పెనుగొండ వైశ్యకుల నాశనమునకు కారకుడై యుండినచో, ప్రోలిసెట్టి ఆత్మగౌరవముబోద్రోసి, ఆ విష్ణువర్ధనుని పేరు తన శాసనములోని కెక్కించి యుండునా? వాని పరిపాలనా సంవత్సరము పేర్కొనునా? అని తీవ్రముగా విమర్శించుచు వ్రాసి యున్నారు.

(రా.రా పట్టాభిషేక సంచిక 143-152 పుటలు చూడుడు)

ఇంతేకాక శా.శ 990 (క్రీ శ.1068) లో వ్రాయింపబడి శ్రీద్రాక్షారామ భీమేశ్వర ఆలయముననున్న యొక శాసనమున విశాఖపట్టణ నివాసి కమ్మకోమటి మేడియ సెట్టి కొడుకు పాపయ యను కమ్మకోమటి పేరు వెలయుచున్నది. అనగా ఆ కాలము నాటికే వాసవ కన్యకా చరిత్రము జరిగి, పారిపోయిన వైశ్యులలో కమ్మకోమట్లను ప్రత్యేక వైశ్యశాఖ యేర్పడినట్లు తెలియుచున్నది, అటులనే శా.శ 1072 (క్రీ.శ 1150) నాటిదగు యొక శాసనమున

(ద్రాక్షారామ భీమేశ్వరాలయ మందలిదే) జగన్నాథపుర నివాసి కమ్మ కోమటి మేడిసెట్టి కొడుకు కొమ్మిసెట్టి అను నొక కమ్మకోమటి నామము గలదు. ఈ రెండు శాసనములు శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారు కమ్మవారు చంద్ర వంశమున బుట్టిన వారని దేవీపురాణము చాటుచున్నదని వ్రాయుచు పలాయను లైన కోమటులందు కమ్మకోమటులను నొక ప్రత్యేక కోమట్లతెగ యేర్పడిన విషయము ననుమానించుచు చేసిన విమర్శ సరికాదని చాటుచున్నవి.

మరియు పెనుగొండను గురించి రాబర్టు స్యూమల్ వ్రాసిన మద్రాసు ప్రెసిడెన్సి వి.జె.పి 37 తణుకున కాగ్నేయమూల మూడు ప్రాచీన దేవా లయము లున్నట్లును,అందు వాసవీ కన్యకకు గట్టించిన దేవాలయ మొకటి కలదనియు, నగరేశ్వరుని ఆలయమందు రాజ్యకాలమున 7వ సంవత్సరమున కొంత భూమి దేవాలయమునకు సమర్పించియున్నట్లును వివరించి యుండుటచేత, రాజమహేంద్రపుర నిర్మాణకర్త యగు అమ్మరాజ విష్ణువర్ధనుడు రాజ్యభారము వహించిన 7వ సంవత్సరము ననే గతించి యుండుట చేతను, పైదొరవారు చూపిన దానిని బలపరచి నందున వాసవ కన్యక చరిత్ర యీ అమ్మరాజ విష్ణువర్ధనుని కాలమున జరిగినదని నిర్ణయింప వచ్చును అని క్రీ॥శే॥ గ్రంథి వెంకట సుబ్బరాయశర్మగారు వాసవి 11వ సంపుటము 1వ సంచికలో "కన్యకాపరమేశ్వరి" అను వ్యాసమున తెలిపియున్నారు.

అమ్మరాజ విష్ణువర్ధనుడు, కవి జీవిత చరిత్రకారుడును, రాజరాజనరేంద్ర పట్టాభి సంచికా సంపాదకుడును చెప్పినట్లు క్రీ. శ. 918 నుండి 925 వరకు 7 సంవత్సర ములు రాజ్యమేలెను. కవి జీవిత చరిత్రకారుని మీతని కాలముననే రాజమహేంద్రవరము తూర్పు చాళుక్య రాజధాని యయ్యెను. రాజమహేంద్ర వరము నుండియే గదా విష్ణువర్ధనుడు పెనుగొండ నగరమున కేగినది. ఈ అమ్మరాజ విష్ణువర్ధనుడు వైశ్య కన్యకా పురాణము లందు చెప్పబడిన రీతిగా విజయాదిత్యుడను రాజకుమారుడు. కనుక నీతడే వైశ్య, వాసవి కన్యకా పురాణాదు లందన్నిట పేర్కొనబడిన విష్ణువర్ధనుడని చెప్పదగును.

ఇంతేగాక శా.శ 856 (క్రీ.శ. 934) వ సంవత్సరము నాటిదగు నొక కడపజిల్లా తామ్ర శాసనమందు పదుగురు కోమట్లు దూర ప్రయాణముచే నలసి, దప్పిగొని, యెండలందు నీరు గానక శ్రీవేంకటేశ్వర స్వామిని ప్రార్థించి, యొక బండ మీద నూయిఏర్పడ,దప్పి తీర్చుకొని శ్రీవెంకటేశ్వర స్వామికి తమ శిరస్సుల ఖండించి బలియిచ్చిరి. అందుచేత నచట నేర్పడిన గ్రామమునకు 'కోమటి నూతల' అను నామమేర్పడినట్లు జెప్పబడియున్నది. ఈ కోమటి నూతల కడప జిల్లా పులివెందుల తాలూకాలో నున్నది. ఈ కోమట్లు పదుగురు గానే యుండిరి. దుర్గమారణ్యములందు దూరప్రయాణము గావించి, మిగుల

నలసిపోయిన వారుగా జెప్పబడి యున్నారు. శ్రీమద్వాసవాంబను గాని, శ్రీనగరేశ్వరస్వామిని గాని కాకుండా శ్రీవెంకటేశ్వరస్వామిని ప్రార్థించినట్లు చెప్పబడియుండుటచేత, వీరు వాసవ కన్యకతోడ గుండప్రవేశమున కంగీకరింపక పలాయనులైన 612 గోత్రములవారికి సంబంధించిన వారుగా దోచు చున్నది. ఇంకను గుండప్రవేశము జరిగి ఉన్నదేశము విడిచి సుమారేడెనిమిది (1925 నుండి) సంవత్సరాలుగా స్థిరనివాసము కొరకు వివిధ ప్రాంతము లందు పయనించు చున్నట్లు గన్పట్టుచున్నది.

( వి.రంగాచారిగారిచే వ్రాయబడిన మద్రాసు రాష్ట్ర శాసనములు మరియు 596)

ఇంకను శాసనము క్రీ.శ 975వ సంవత్సరము నాటివిగాజెప్పఁబడి, చిత్తూరు జిల్లా 248-249వ శాసనములుగా రికార్డుచేయబడిన నేలపల్లి యందలి రెండు శిలాశాసనములందు "ఇరివనోలంబఘడే యంకకార పల్లవాదిత్యుడను నోలంబ పల్లవరాజు కోయటూరిని వ్రాసియు, బలిగారవైశ్యుడు అయిన ముమ్మిడి గౌరసెట్టికి" "ముమ్మిడి గవరె పల్లవాదిత్య నోలంబశెట్టి" యను బిరుదము, నశ్వము, ఛత్రషాహకుడు, సింహాసనము, అర్ధాంగి మున్నగు రాజలాంఛనములును, పులినాడు లోని కోయటూరను గ్రామము నకు పల్లవాదిత్యపురమను పేరుబెట్టి దానిని వైశ్య దత్తనగరముగా జేసి, కొడెగనా విచ్చినట్లును యీ గౌరసెట్టియు, నితని తమ్ముడు సుందర చోళసెట్టియు కాంచీపుర నివాసులనియు, వీరికి సంబంధించిన వారు 4800ల మంది వర్తకులుండి రనియు దెలియుచున్నది. అనగా క్రీ.శ.975 సంవత్సరము నాటికి వాసవ కన్యకా గుండప్రవేశము జరిగి సుమారు 50 సంవత్సరము లగుట చేత పలాయనులైన కొందరు వైశ్యులు స్థిరనివాసములు గలవారలై ఆయా ప్రాంతీయ పాలకుల ప్రాపకమున వర్ధిల్లుచుండినట్లును, అట్టి వారికి జెందిన వారిలోన గాజులబలిజ (బలిగార) శెట్టియగు ముమ్మిడి గౌరసెట్టి యొక ప్రముఖుడనియు దెలిసికొనగును.

(వాసవి సం॥ 2,10 వ సంచిక చూడుడు)

వైశ్య, వాసవ కన్యకా పురాణము లందెల్లెడల నీ పురాణ గాథను సాలంకాయన మహర్షి వైశ్యులకు చెప్పినట్లున్నది. ఈ సాలంకాయన మహర్షి చాళుక్యులకు మునుపు తెలుగుదేశమును రాజ్యమేలిన సాలంకాయనులను బ్రాహ్మణ రాజుల తెగకు చెందినవాడై యుండవలెను. రాజ్యమును బోగొట్టుకొన్న వెనుక స్వకుల సాంప్రదాయానుసరణి, పౌరోహిత్య వృత్తి నవలంబించి, యక్కాలమున నగరాధిపతులై, ధనికులై విలసిల్లు చుండిన వైశ్యులను జేరి వారికి పురోహితులును, కథకులునై విలసిల్లిరి కాబోలు! యీ సాలంకాయనులు. వారిలో నీ వైశ్య పురాణ గాధ జెప్పిన సాలంకా యనుడు మహర్షిగా నుండి రనవచ్చును

(ఇంకావుంది)

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.
ఫోన్ : 4942074, 4941973




అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మ్మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను. అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను. అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు
దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

**ఆర్.ఆర్.నాధం**
మేనేజింగ్ ట్రస్టీ

(మార్చి సంచిక తరువాయి)

40. ఋగ్వేదమునుండి యొక **వాక్యము** జెప్పెదను. "కొనోమహ్యా అదితయె **పునర్దాత్** పితరంచదృశేయం మాతరంచ" **నేను నా** తల్లితండ్రులను జూచుటకై అదితియనగా (అనంతుని) అదితియొద్దకు నన్ను తీసికొని వెళ్ళువారెవరు. ఈ మంత్రము పునర్జన్మకు వ్యతిరేకముగా గానవచ్చుచున్నది. ఆవిషయమై ప్రస్తాపించ బూనిన యొక దివసము బట్టుగాన యిచ్చట వదలివేసెదను.

41. సంస్కృతభాషను పునరుద్ధారణ జేయవలయునని ఆతురత పడు చున్నప్పటికి అటులొనర్చుటలో మనము గొప్ప తప్పుత్రోవను బట్టుచున్నాము. ఈ వాక్యము హైందవసోదరుల కనేకులకు కష్టముగా నుండవచ్చునుగాని యిది ముమ్మాటికి నిశ్చయమని చెప్పుటకు సాహసించుచున్నాడను. సంస్కృత భాష నభివృద్ధి జేయవలయునను నుద్దేశముతో దేశమెల్లెడ లను సంస్కృత పాఠశాలలను స్థాపించినందులకై దివ్య జ్ఞాన సమాజము వారి కనేక వందనములు. ప్రస్తుతము మనమున్న పాఠశాలయును వారిమీదనే ఆధారపడియున్నది. కాని వారు విద్యా విధానమును సరిజూచు కొననియెడల మేలుకన్న కీడెక్కువచేసిన వారగుదురు. పాశ్చాత్య విద్య మనపిచ్చి నమ్మకముల లయునని ప్రయత్నించు చున్నది. కాని ప్రస్తుతము గరప బడుచున్న సంస్కృతము వానిని యెక్కువ అభివృద్ధి చేయుచున్నది. మీరేమి గరపుచున్నారు. ఏమి గరప వలసియున్నది. ఏవి యభ్య సింప వలసి యున్నది? యీ సమస్యల కంతునాకు తెలియకున్నది. అధ్యక్షులును విద్వత్సభికులును హిందూ దేశముయొక్క క్షేమమును కోరివారుగాన లోపముల దెలుపుటకై నేను సాహసించుచున్నాను. కాళిదాసు యొక్క కావ్యములను చిన్న తరగతులందు మీరు బోధించు చున్నారు, అభ్యసించు చున్నారు. పాశ్చాత్యులకు కాళిదాసుతో తుల్యుడగు షేక్స్పియరు రచియించిన గ్రంథము లను యింగ్లీషు పాఠశాలలో ప్రారంభమున నేర్పినయెడల యెంత హాస్యాస్పదముగ నుండును. కొందరు పురాణములను కొందరు స్మృతులను చదువవచ్చుగాని అంతటితో నాగిపోదురు. స్మృతి నర్థరహితముగా చదివినవారు చాలా అరుదు. ఈ గ్రంథము లుత్కృష్టములైనవి. ఐనను అచ్చటచ్చట వజ్రతుల్యములైన అంశము లున్నను మనుజులకుఅర్థాభిప్రాయములున్ను, పిచ్చి యభిప్రాయము లున్ను భోధించుచున్నవి. ఇది యంతయు బ్రాహ్మణులు తమ ఈ అధిక్యతను గాపాడుటకై పన్నిన పన్నాగము. ఇవి దురభిప్రాయముతోను పిచ్చి అభిప్రాయముతోను కూడికొనిన పనులు. పురాణములన్నియు మానవ బృందము యొక్క వ్యత్యస్తము చూపుటకు వేరు వేరు విధములైన పూజా విధానములు తెలుపుటకును యేర్పడి యున్నవి. మనము దయ్యములు భూతములు మంచి, చెడ్డ నక్షత్రములు మొదలగు

నమ్మకములను వదలి వేయవలయునని ప్రయత్నించు చుండగా నీపురాణము లిట్టి పిచ్చిభ్రమలను యెక్కువ బలపరచు చున్నవి. రామాయణ మందు నిరూపింప బడిన రాముని శౌర్యమును, సీత పాతివ్రత్యమును, లక్ష్మణుని విధి నిర్వాహకమునకును దివ్యముగా నున్నప్పటికి ఒకానొకశూద్రుడు తపస్సు చేసి పాపి యైనట్లు చెప్పియుండుట చాలా అసందర్భము. హిందూదేశమును పునరుద్ధరించవలయునన్న వేదమును అర్థజ్ఞానములేక వల్లె వేయించుటగాక అర్థసహితముగా బోధించవలయును. వేద సమ్మాజముల వల్ల ప్రచురింపబడిన అర్థసహితమైన యీశోపనిషత్తు మంత్ర పుష్పములు మతవిషయమై సంస్కృత పాఠశాలలయందు ప్రథమున బోధించుటకు తగియున్నవి.

42 మీరు విసుగు చెందనియెడ మన పురాతనాచారములు ఉత్కృష్టమైన ధర్మములను బోధించినవని నిరూపించెదను అనేక విషయముల జెప్పి కాలాతీతము చేయుటకన్న కొన్ని సందర్భములను సూచించెదను ఉపవాస పద్ధతిని తీసికొనియెదము, నిరాహారమనగా నర్థమేమి? తిండిలేక మాడుటగాదు ఉపవాసము (సమీపించుట) యీరెండు పదములును చేరి ఉపవాసమైనది. మనము విశేష కాలము ప్రాపంచిక విషయములందే గడుపుచున్నాము. కాన కొంతకాలము పరమార్థవిషయ చింతన చేయుటకై అనగా జీవాత్మ పరమాత్మలకు గల సంబంధము నభివృద్ధిపరచుటకు ఉపవసించ వలసియున్నది. ఈ దినమునే ఉపవాసమనుచున్నాము. దేవునితో జీవించుచు వానితో సంభాషించుటయె అమృతపానమొనర్చుట. అప్పుడే మనము తన్మయత్వమొంది దేహపోషణార్థమైన ఆహారమును మరచిపోదుము. ఆహార . విసర్జనమొనర్చుట తాత్కాలికముగా దాని యంతటది సంభవించునది. కాని ప్రస్తుతము దీనిభావము మరచి నిరాహారము విధికృతమని తలంచుచున్నాము. మన మాహారవిసర్జన మొనరించెదము గాని దైవ ధ్యాన మొనర్పము. కాలయాపనమునకు చీట్లాట మొదలైన ఆటలాడుచుందురు. ఇంగ్లీషున నుపవాసమునకు "హోలీడే"అను చుందురు. ఇప్పుడు దాని "హాలీడే 'యని మార్చి ఆటపాటల క్రింద నువయోగించుచున్నారు. మన ముపవాస దినమున నిరాహారులముగా నుండుచున్నాము. ఉపవాస పద్ధతి యొక్క యధార్థతత్వమును గ్రహించి ఆదిన మీశ్వరధ్యానమునకై యుపయోగ పరచవలసి యున్నది. ఇదియే యోగముయొక్క సత్యతత్వము.

43 మరియొక యుదాహరణమును గైకొందము. దేవాగారములకు భార్యాపుత్ర సమేతముగా మనము వెళ్ళు చున్నాము. అచ్చట ననేక స్త్రీపురుషులతో గలియు చున్నాము. కార్యముల పట్ల సతీపతులు గలిసి కూర్చొను చున్నారు. దీని యర్థమేమి? ఇందు మూలమున మనపూర్వులు జనానా(గోషా) పద్ధతిననుసరించి యుండ నట్లు విదితమగుచున్నది. ఇట్టి తరి మిషన్‌బాలికా పాఠశాలల యందు బాలికలకు బహుమతి నొసంగునట్టి

తరుణమున హిందూస్త్రీలచ్చట యున్నారను నెపముచే పురుషులమైన మనను లోపలికి రానివ్వకుండుటకు నేనుకారణ మరయజాలకున్నాను. స్త్రీపురుషులు దేవాలయమునకలసి మెలసితిరుగుచుండ యిట్టి సభలయం దేల కలిసి యుండరాదు? రాబోవు వత్సర మది సంస్కరింప బడవలెనని కోరు చున్నాను. దంపతులొక బండిలో కూర్చొని వెళ్లుచుండిన యెడల మనమేల పరిహాసమొనర్పవలె? ఇట్టి వాటియందు చెన్నపురి మన కంటె మంచి స్థితి యందున్నట్లు కనుపించుచున్నది. చుట్టు ప్రక్కల ప్రదేశములు కూడా దాని ననుసరించియుండవలెనని మదీయకోరిక. ఏను పాశ్చాత్యపద్ధతుల ననుసరింపుడను చున్నానని నిందించవలదు. మన పూర్వాచారములను మాత్రమే పునరు ద్ధరింపవలయునని కోరుచున్నాను. క్రైస్తవసోదరులకు మన వివాహములందేమి చేయుచున్నామొ తెలియక పోవచ్చును. ఇప్పుడు దంపత్తులు కలిసి భుజింపకూడదు. అది దురాచారమని తలంపబడుచున్నది. వైవాహిక సమయమున నేర్పడిన యాచార మితర కాలములందేల ననుసరింప రాదు. ఆసమయమున భార్యా భర్తలొకచో కూర్చొని భుజించెదరు. భర్త విడచి వెళ్ళిన యెంగిలి పత్రమున వంట వానితో వార్తలు జెప్పుచు భుజించుచుండుటకన్న సతీ పతులు కలసి సంభాషించుకొనుచు భుజించినయెడల యెంతో సంతోష కరముగా నుండును. వేయేల మన ఋషివర్యులు గరపిన యాచారములనే యనుసరించ వలయునని జెప్పుచు అట్టి బోధలనే జేయుచున్న మన పశ్చి మార్యులకు వందనము - లర్పించు చున్నాను.

44 మన పాశ్చాత్య సోదరులచే బోధింపబడుచున్న అద్వైతము మన ఋషుల చేతనే బోధింపబడియున్నది. కాని దాని ననుసరించ వలయును. విగ్రహారాధనము, కోతులను పాములనే గాక గోమయమును కూడా పూజించు అవివేకపు పద్ధతులను మన వేదమెచ్చటను జెప్పియుండలేదు. క్రైస్తవులును వానిని వదలివేయమని జెప్పుచున్నారు. మనము విసర్జించ ప్రయత్నించెదము. ఈ విధము నే వర్ణభేదమును, బాల్య వివాహ ములను, వితంతూద్వాహములను, సముద్ర యానమును, స్త్రీలయెడ గౌరవ మును సంస్కరింపలసియున్నది. ఇవన్నియు సంస్కారములు కావు గాని మన పూర్వుల సదాచారములను పునరుద్ధారణము చేయుటయైయున్నది. కాన మీరెల్లరును ముందంజవేసి యిట్టి వాటికై తోడ్పడ వలయునని మదీయాశయము.

45 ఆంగ్లేయులు మన కిన్ని విషయములు గూర్చి దెలుపుచుండగా మనమేమియు వారికి బోధింపజాలమా? పూర్వఋషులు మనకు దెలిపిన యంశములనెల్ల మనము మరచి పోతిమా? పూర్వాచారములలో మనమిప్పటికి ననుస రించు చున్నవి కొన్నికలవు. పాశ్చాత్యసోదరు లాగ్రహముచెందని యెడల కొన్ని యుదాహరణముల నిచ్చెదను.

46 సభయందున్న పాశ్చాత్యులెల్లరు సంతోషపూర్వకముగా గైకొందుమని నుడివిరి. భార్య మృతి జెందినయెడల

నాపె సోదరిని వివాహము జేసికొనుట అనేకభంగుల మంచి పద్ధతి. గాని పాశ్చాత్యులు దాని ననుసరింపరు. అచ్చటి పాశ్చాత్యులు యీనవీనాచారమునకు తామెప్పికొనినను పార్లమెంటు మెప్పికొన లేదని నుడివిరి. హైందవులచే ఆచరించ బడుచున్న యీ ఆచారము పాశ్చాత్యులును త్వరలో స్వీకరించెదరని నేను దలంచుచున్నాను. మనవేద మొక ముఖ్యాంశమును బోధించుచున్నది. మనము విదేశీయులచే పరిపాలింప బడలేదని జెప్పుచున్నది. విక్టోరియా మహారాణి విదేశీయురాలుగాదు. ఆమె మన ఆర్యసంతతికి చేరినదే. వేల సంవత్సరములకు పూర్వము విడిపోయిన మన ఆర్యసంతతుల మెల్ల తిరిగి నేడు గలియుట భాగ్యముగాన మనహైందవులును పాశ్చాత్యులును ఒకరినొకరు సోదర సోదరీభావములతో జూచుచు నొకరినొకరు ప్రేమించు చుండవలసి యున్నది. మాక్సుముల్ల రంతటివారే మన మెల్లర మార్యులమనియు మన బంధువర్గ మెల్ల హిందూదేశమున నున్నదనియు జెప్పియున్నాడు.

47 సోదరసోదరీమణులారా! మనము బంధువులచేతనే పరిపాలింప బడుచున్నారము. సభానాయకుడును, యిచ్చట నున్న పాశ్చాత్య స్త్రీలును మన సోదరసోదరీమణులే. మనజాతికి చేరినవారే మనల పరిపాలించుచుండుటెంత సంతోషదాయకము. మనలనెల్ల పాలించుటకు 'ద్యౌపితా" మనము మతమునందును రాజకీయము నందును మన మెల్లర మొక్కటియేకాన అందర మేకీభవించి పాటుబడవలసి యున్నది. ఈ యుపన్యాసము ముగించకపూర్వము స్వరమందున్న మనతండ్రికొక చిన్న ప్రార్థన చేసెదను. అటులొనరించుటకు పూర్వము తప్పుల నెన్నక యోపికతో నుపన్యాస మాకర్ణించిన సభానాయకునకును సభ్యులకును అందు ముఖ్యముగ స్త్రీలకును వందనము లర్పించుచున్నాను. ఓ ద్యౌపితా మాపైకరుణింపుము. నీ పితృత్వమును మా సోదరత్వమును మా కెల్లరకు విశద పరచుము. మే మందరమొక తండ్రి బిడ్డలమైన సహజన్ములవలె ప్రేమించునట్లు చేయుము. అసూయతోను, ఓర్పులేమియు, అలక్ష్యతను, అసహ్యతను, మానుండి తొలగించుము. మేమొకరికొకరము ప్రేమాను బంధము గలిగి సన్మార్గమున ప్రవర్తించుచు యజ్ఞానాంధకారమును పారదోలి జ్ఞానజ్యోతినిగాంచి ప్రభువైన నీవే మా తండ్రివనియు నీవే మాకెల్లరకు తల్లివనియు మేము స్మరించుకొనునట్లు చేయుము. ఋషులవాక్కు వచ్చినట్లు "అసతోమాసద్గమయ తమసోమాజ్యోతిర్గమయమృత్యోర్మా అమృతంగమయ" దుష్పథము నుండి తొలగించి సత్పథమున నడుపుము. అంధకారమును పారదోలి ప్రకాశమును జూపుము. మృత్యువును పారదోలి నిత్యజీవన మొసంగుము.

(ప్రథమోపన్యాసం సమాప్తం)

# గాయత్రీ మంత్రము-అర్థము

మంత్రము :-

"ఓం భూర్భువః స్వః తత్స
వితుర్వరేణ్యం భర్గోదేవస్య
ధీమహి ధియో యోనః
ప్రచోదయాత్"

అర్థము :-

ఓం - ఇది పరమేశ్వరుని ముఖ్య నామము. ఈ నామమునందు అనగా ఈ పేరులో భగవంతునికి గల ఇతర నామములన్నీ ఇముడు చున్నవి.

భూః = ఎవ్వడు ప్రాణమునకు కూడ ప్రాణమైన వాడో

భువః= ఎవ్వడు సమస్త దుఃఖములనూ పోగొట్టువాడో

స్వః = ఎవ్వడు స్వయముగా సుఖ స్వరూపుడునూ, తనను ఉపాసించు వారందరికీ సమస్త సుఖములనూ ప్రసాదించు వాడునూ - అయి, ఉన్నాడో, అట్టి

సవితుః = సకల జగత్తునూ సృష్టించు వాడునూ, సూర్యుడూ మొదలగు ప్రకాశము కలిగించు వారలకు ప్రకాశమునూ, సంపూర్ణ ఐశ్వర్యములనూ ఇచ్చు చున్నట్టి దాతయో

దేవస్యః = కామింపదగు వాడునూ, సర్వత్రా విజయములను కలిగించు వాడునూ, అగు పరమాత్ముని యొక్క

వరేణ్యమ్ = అతి శ్రేష్ఠమైనట్టియూ, ధ్యానింప తగినట్టియూ

భర్గః = సమస్త కష్టములను (క్లేశములను) భస్మము చేయగలుగునట్టియూ, విచిత్రమైనట్టియూ, శుద్ధ స్వరూపమునూ ఏది కలదో

తత్ = దానిని, మేము

ధీమహి = ధరింతుము గాక

యః = ఆ పరమాత్ముడు

నః = మా యొక్క

ధియః = బుద్ధులను ఉత్తమ గుణ కర్మ స్వభావములందు

ప్రచోదయాత్ = ప్రేరేపించు గాత

ఈ ప్రయోజనము కొఱకే ఆ జగదీశ్వరుని స్తుతించవలెను. ప్రార్థించ వలెను. ఉపాసించవలెను. స్తుతించుట అనగా స్తోత్రము చేయుట. పొగడుట. ప్రార్థన అనగా అడుగు కొనుట. యాచించుట. వేడుకొనుట. ఉపాసన అనగా సేవించుట.

## శ్రీ లక్ష్మీ నృసింహ సోమయాజి వైశ్య సమాజం వారిచే పేద వైశ్యులకు 90 వేలు సహాయం

మచిలీ పట్టణం కార్య స్థానంగా గల పై సమాజం వారు 6-4-1997న సమావేశమై ఈ 1997-98 సంవత్సరములో విద్యానిధి నుండీ 50 వేలు, పోషకనిధి నుండీ 10 వేలు, వైద్య నిధి నుండీ 10 వేలు, వివాహ నిధి నుండీ 10 వేలు, దహన సంస్కార సహాయనిధి నుండీ 10 వేలు వెరశి 90 వేలు రూపాయలను పేద వైశ్యులకు సహాయాన్ని అందించాలని తీర్మానించారు

# అర్హులందరినీ మహాసభకు దూరం చేసిన వాడు వేమయ్య అనుట సత్యదూరం కాదు

- ఇల్లూరు శంకరయ్య గుప్త, గుత్తి

వైశ్య ప్రబోధిని మార్చి సంచికలో ప్రచురించిన 14-2-1997 తేదీగల శ్రీ జూటూరు వేమయ్య గారికి వ్రాసిన లేఖను పూర్తిగా చదివాను. శ్రీ వేమయ్య గారు ఈ లేఖలోని ప్రతి పేరాకు న్యాయంగా సమాధానం ఇవ్వాలి. శ్రీ జూటూరు వేమయ్య గారికి అన్నీ తెలుసు. ఆయన అభినయముతో - మహాసభకు నేతగా ఉండి - అర్హులందరినీ ఆయన మహాసభకు దూరం - చేసినారనుట సత్యదూరం కాదు. ఆయన అదృష్టం బాగుండబట్టి ప్రజల నాడి తెలియని ప్రాబల్యము గల వ్యక్తులు శ్రీ జూటూరు వేమయ్య గారిని నమ్మి మహాసభకు నేతను చేశారు. మహాసభ నియమావళికి రకరకాలుగా సవరణలు ఆయన వల్లే జరిగినవి. ఆయన మహాసభకు చేసింది తక్కువే - గుర్తింపు ఎక్కువగా లభించింది. కనీసం ఆయన మహాసభ నియమావళిని అనుసరించి ఉంటే "మహాసభ నియమావళిని నేనే చేసినాను" అని ఆయన చెప్పు కొంటున్నందుకు కొంత న్యాయం జరిగేది కుల సంక్షేమాభివృద్ధికి ఆయన చేసిన సేవలు గుర్చించి బాహాటంగా కాక పోయినా అంతరింగికంగా నైనా మహాసభలోనే ఆయన తన పలుకు బడితో చర్చావేదిక ఏర్పాటు చేస్తే - మహాసభ విషయముగా ఆయన పడే తపనలోని సారం తెలుస్తుంది. ఆయన వాణిజ్య వ్యవహారాలు కూడ 'అడల్ట్రేషన్' కావాలని తపనతో - తన అభినయముతో తెలుగు పదాలకన్నా ఎక్కువగా ఇంగ్లీషు పదాలతో మాట్లాడు చున్నాడు. ఆయన మహా సభాధ్యక్షుడై రాయలసీమలో అర్హులైన వారిపట్ల ఆయన అనుసరించిన పాత్రను చరిత్ర ఏనోడో ఒకనాడు చాటుతుంది. వైశ్యభవన్‌లో గల భవన భాగం వైశ్యేతరులకు ఇచ్చి చక్కని హోటల్ ఏర్పాటు చేసిరి. వైశ్య భవనము ముందు భాగాన గల టెలీఫోను బూతును వైశ్యేతరుల కిచ్చి వైశ్యులకు అపారమైన సేవలందించిరి. మహాసభ సౌజన్యంతో - సంక్షేమ సభలకు మారుగా వేదాంత సభలను శ్రీశైలంలో జరిపించిరి. ఏమీ తెలియనట్లు వ్యవరిస్తూ - అన్నిట్లో తన పాత్రము ఉండునట్లు చూచుకొని, మన మహాసభ సేవలు తెరమరుగగుటకు అహో ఆయన గారి సలహాలూ, సూచనలూ భేష్, భేష్. ఆయన బాగా చలామణి కాగలుగుట వల్ల రాష్ట్రములో గల అరవై లక్షల ఆర్యవైశ్యుల్లో తనకన్నా మిన్న కారాదని, తన పెరుగుదలకు తోడూ నీడై వ్యవహ రించిన వారిని కడు జాగ్రత్తగా - గుప్తంగా మహాసభకు దూరం చేయుటలో ఆయన అనుసరించిన పద్ధతి అంతగొప్పది. వాసవీ స్రవంతికి లక్షల్లో నష్టం వస్తున్నది

ఆయనకు తెలుసు. వాసవీ స్రవంతి ఎడిటర్ శ్రీ యం.ఆర్.కె. మూర్తిగారికి వారానికో సారి ఫోన్ చేసినా నష్టం తగ్గించేందుకు ఆయన చేసిన కృషి ఏమిటి? ఆయనదే సరియైన గీత. 60 లక్షల ఆర్యవైశ్యుల గీతలు ఆయన కవసరం లేదు.

వింశతి వత్సరాలుగా ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభలో శాశ్వత స్థానం ఆక్రమించి, రాయలసీమకే కీర్తి తెచ్చే తిరుపతి పంగులూరు సీతమ్మ ఆస్తిని సదా రక్షించుటలో మహాసభ అధ్యక్షుడిగా - మహాసభ నేతగా ఆయన చేసిన కృషి ధర్మ పీఠంవద్ద తేలవలసిన విషయం. మహాసభలో తన పట్టును కోల్పోకుండుటకై 'వేదాంతిని' అని చెప్పుకుంటూ వేమయ్య పడే తపనకూ, మహాసభకు 'అధ్యక్షుడవుతాడు' అనుకునే వ్యక్తిని ముందుగానే కౌగిలించు కొని మాట్లాడే తీరుకూ ఆయన తప్ప మరెవరూసాటిరారు. కాలగర్భములో ఏం దాగిందో తెలియని మా వంటి వారిపై వేమయ్య చూపిన అసురప్రేమను మేము మరువ జాలము.

## ఆంధ్రప్రదేశ అవోపాకు నూతన కార్యవర్గము

హైద్రాబాద్ ప్రధాన కార్యస్థానంగా గల ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య అఫిషియల్స్ అండ్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్ నూతన కార్యవర్గ సభ్యులు. అధ్యక్షులు శ్రీ బట్టే పొట్టి శ్రీరాములు, ప్రధాన కార్యదర్శి శ్రీ యం. తిమ్మయ్య, కార్యదర్శులు శ్రీ పోకల చందర్, శ్రీ వి. రామకృష్ణ, శ్రీ యం.వి. మాణిక్యం, ఉపాధ్యక్షులు శ్రీ వి. పున్నం చందర్, శ్రీ జి. కృష్ణయ్య, శ్రీ కె. రామసుబ్బయ్య, శ్రీ ఒజ్జల రాజమౌళి, శ్రీ పి. వి. సుబ్బరావు, శ్రీ కె. రామచంద్రరావు, శ్రీ పేరాల కామరాజు ప్రాంతీయ కార్యదర్శులు శ్రీ వి. రామేశమ్, శ్రీ యస్. శంకరయ్య, శ్రీ యన్. యం. మోహన్ రావు, శ్రీ పి. మల్లికార్జున శ్రేష్ఠి, శ్రీ కె. కేశవ రావు, ఎక్స్ అఫిషియో మెంబర్స్ శ్రీ కె.వి. రంగయ్య, శ్రీ వి.వి. అప్పారావు, శ్రీ జి.సి. గుప్త, శ్రీ పి. లక్ష్మి కాంతం శ్రేష్ఠి, శ్రీ యం. ఆర్.కె. మూర్తి, శ్రీ కె.వి. సుబ్బరావు, శ్రీ కె. శివప్రసాద గుప్త, శ్రీ సి.హెచ్. పున్నారావు, శ్రీ కె. కోటేశ్వర రావు, శ్రీ మారం లక్షుమయ్య.

## అనంతపురం కొత్తవూరు ఆర్యవైశ్య సంఘానికి నూతన కార్యవర్గం

పై సంఘం సర్వసభ్య సమావేశము 27-4-97న సంఘ గౌరవాధ్యక్షులు శ్రీ దొంతి విశ్వనాథ గుప్త గారి అధ్యక్షతన జరుగ క్రింది వారలు నూతన కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైరి. అధ్యక్షులు శ్రీ మచ్చా నరసింహులు, ఉపాధ్యక్షులుశ్రీ మంచి కంటి రంగయ్య, శ్రీ గొంది కొండయ్య ప్రధాన కార్యదర్శి శ్రీ మారడుగు సత్యనారాయణ, కార్యదర్శులు శ్రీ టంగుటూరు రామకృష్ణ, కల్లూరు నాగరాజు, కోశాధికారి శ్రీ రాచర్ల మల్లేశం గుప్త.






# Sri Sai Sadan (MEDA'S GUEST HOUSE)

**SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.**
**Anantapur Dist. (A.P.) India.**
**Ph : 08555-87507, 87508 Fax : 08555-87508**

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet.
2. Every suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. Air-conditioned Suits are also available.
5. A pure vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.
6. STD, ISTD, FAX Facilities.
7. A Doctor on call.
8. Safety Lockers.
9. Ample parking space.
10. Prompt service and best facilities at affordable Tariff.

**Registered Office :**
**6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.**
**Phones : Off : 3394320, Res : 3313796 (STD : 040) Fax : 394320**

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.5.1997 నుండి 20.6.1997 వరకు)

31.3.1997వ తేదీతో లెక్కలు ముగించిన అసెసీలు తాము రూ 2500/-లకు మించి వడ్డీ జమ ఖర్చు చేసినపుడు పట్టుకొన్న పన్ను మొత్తాన్ని 31.5.1997వ తేదీ లోగా ప్రభుత్వ ఖజానాలో జమ కట్టాలి.

1996-1997ఆర్థిక సంవత్సరములో ఆదాయము పన్ను విధింపునకు అర్హమగు ఆదాయము వచ్చు క్రొత్త అసెసీలు గత సంవత్సరము రూ. 35,000/-లకు మించి ఆదాయము వచ్చి యుండియూ పర్మనెంటు నెంబరును (PA No.) పొందనివారు తమంతట తామే ఫారము నెం. 49A ను పూర్తిచేసి అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి 31.5.1997 తేదీలోగా చేరునట్లుగా పంపాలి.

1996-1997 కు సంబంధించి లాటరీలు, క్రాస్‌వర్డ్ ఫజిల్స్‌లలో గెలుపొందిన వివరాలను తెలుపు అన్యువల్ రిటర్నును ఫారము నెం. 26Bని ఈ (మే) నెల 31వ తేదీలోగా అందునట్లుగా అందుకుసంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చాలి.

1996-1997ఆర్థిక సంవత్సరానికి సంబంధించి గుర్రపు పందెములలో గెలుపొందిన వివరాలను తెలుపు రిటర్ను ఫారము నెం. 26BB ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ (మే) నెల 31వ తేదీలోగా చేర్చాలి.

1996-1997ఏప్రిల్ నెల జీతములో పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ (మే)నెల 31వ తేదీలోగా చేర్చాలి.

పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 ఏప్రిల్ నెలలో చెల్లించిన జీతములు ఆ జీతములలో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు సేట్‌మెంట్ ఫారము నెంబరు 21ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ మే) నెల 31వ తేదీలోగా చేర్చాలి.

ఆదాయపు పన్ను చట్టము లోని 192 విభాగము క్రింద జీతములలో పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 'అన్యువల్ రిటర్ను' అనగా 24వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ (మే) నెల 31వ తారీఖులోగా చేర్చాలి.

కంపెనీలు 1998-1999 అసెస్ మెంట్ సంవత్సరానికి సంబంధించి చెల్లించ వలసిన 'అడ్వాన్సు ట్యాక్సు మొదటి కంతును రానున్న (జూన్) నెల 15వ తేదీలోగా చెల్లించాలి. స్టేట్‌మెంట్ అవసరంలేదు. ఎస్టిమేట్ రిటర్నును దాఖలు చేస్తేచాలు.

మీరు పంపవలసిన A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు జూన్ నెల 20వ తేదీయే చివరిది. మీరు పంపు A-2 రిటర్నును చలానాతో బాటు కాకుండా, చెక్కుతో బాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా ఆ A-2 రిటర్నును చెక్కుతోబాటు పంపుటను జూన్ నెల 15వ తేదీలోగా చేయాలి.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమ్మునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున, నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ 5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును. వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

**'ప్రజాబంధు', 'దానశీల' కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

శరీరానికి శక్తి, సంసారానికి అనురక్తి! ప్రతిరోజు 2 క్యాప్సూల్స్
వాడితే సరిపోతుంది.



# ఓజోమెన్ క్యాప్సూల్స్

* ఆనందంగా, ఆరోగ్యంగా జీవించటం మీకిష్టమైతే
* మీ శ్రీమతిని మరింతగా ప్రేమించటం మీ కోర్కెయైతే
* తరిగిపోని యవ్వనశక్తి మీకు కావాలంటే
* సుఖమయ దాంపత్యజీవితం మీ ధ్యేయమయితే

**ఇప్పుడు మీకు కావలసినది ఓజోమెన్ క్యాప్సూల్స్**
ఇది ప్రకృతి ప్రసాదిత వనమూలికలు మరియు ఖనిజముల మిశ్రమము. ఎంతకాలమైనను వాడవచ్చును. పథ్యంలేదు. ఎటువంటి దుష్ఫలితాలు ఉండవు.

ఇంకా వివరములు తెలుసుకొనగోరువారు క్రింది అడ్రసుకు ఒక పోస్టుకార్డు వ్రాసిన చాలు ఎంతో సమాచారం తెలుస్తుంది.




తయారుచేయువారు



**ఫిజికెమ్ లేబరేటరీస్**
పోస్టుబాక్సు నెం : 84
విజయవాడ - 520 001

మార్కెట్ చేయువారు
**స్టెర్లింగ్ రెమిడీస్**
PO బాక్సు నెం : 194,
విజయవాడ - 520 001

పేరొందిన అన్ని మందుల షాపులలో లభ్యం

Licence No.59 WITHOUT PREPAYMENT
YA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. [illegible]